ఓమ్

# విజ్ఞప్తి

గుంటూరుజిల్లా గుంటూరు తాలూకా ఉప్పలపాడు గ్రామములో కీ. శే. పెద్ది వీరయ్యగారి కుమారుడు పెద్ది శేషయ్యగారి జ్ఞాపకార్థముగా, వీరి ధర్మపత్ని శ్రీమతి పెద్ది పుల్లమ్మగారిచే నిర్మింపబడిన ప్రాథమిక పాఠశాల, తదంగభూతమగు ప్రార్థనామందిరము, ఉప్పలపాడు గ్రామస్థుల ఉపయోగార్థము నిర్మింపబడినది. ఆ ప్రార్థనామందిరమున అనుదినము జరుగు దైవసంకీర్తనము లనేకులు వ్రాసికొని పఠించుటలో శ్రమ కలుగుచున్నందువల్ల శ్రీమతి పుల్లమ్మగారి తండ్రిగారైన పాలడుగు వెంకయ్యగారి ప్రోత్సాహముతోడను గ్రామస్థుల సహాయముచేతను భగవన్నామ సంకీర్తనములు అను పేరులో వాటినన్నిటి జేర్చి పుస్తకరూపమున ప్రకటించడ మైనది.

ప్రార్థనామందిరము
ఉప్పలపాడు (పోస్టు)
గుంటూరు తా.

ఇట్లు ప్రకాశకులు
శ్రీ మహర్షి మళయాలస్వాములవారిపాదధూళి
భజనబాబు

# భగవన్నామసంకీర్తనలు

## —♦ శ్రీ సద్గురుధ్యానమ్. ♦—

ఓం బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యమ్
ఏకం నిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి. 1

చైతన్యం పరిపూర్ణమేకమచలం జ్యోతిర్మయం వ్యాపకం
తత్త్వంచాక్షర మంత్రమగ్ర్యమమలంసూక్ష్మాతిసూక్ష్మం పరమ్
లింగం బ్రహ్మ సనాతనం సుమనసాం ధ్యాతవ్యమానం సదా
బాహ్యాభ్యంతరసంస్థితం పరశివం ప్రాణేశ్వరం భావయే. 2

గమాగమస్థం గమనాది వర్జితం
చిద్రూపదీపం తిమిరాంధనాశనమ్
పశ్యామి తం సర్వజనాంతరస్థం
నమామి హంసం పరమాత్మ రూపమ్. 3

## —* దైవ ప్రార్థన *—

కరుణామూర్తియగు సర్వేశ్వరా! మాచిత్తము సర్వకాల సర్వావస్థలయందును నీపాదారవిందములందు లగ్నమై అచంచలమైన భక్తితో కూడియుండునట్లు అనుగ్రహింపుము!

పరమదయానిధీ! ప్రాతఃకాలమున నిద్రలేచినది మొదలు మరల పరుండువఱకును మనోవాక్కాయములచే మావలన ఎవరికిని అపకారము కలుగకుండునట్లును, ఇతర

ప్రాణికోట్లకు ఉపకారముచేయులాగునను సద్బుద్ధిని దయ చేయుము !

సచ్చిదానందమూర్తీ! నిర్మలాత్మా! మా యంతః కరణమునందు ఎన్నడును ఏవిధమైన దుష్టసంకల్పముగాని, విషయవాసనగాని, అజ్ఞానవృత్తిగాని జొరబడకుండునట్లు దయతో అనుగ్రహింపుము!

వేదాంతవేద్యా! అభయస్వరూపా! మాయందు భక్తి, జ్ఞాన, వైరాగ్యబీజము లంకురించి శీఘ్రముగ ప్రవృద్ధములగు నట్లు ఆశీర్వదింపుము! మఱియు ఈజన్మమునందే కడతేరి నీ సాన్నిధ్యమున కేతెంచుటకు వలసిన శక్తిసామర్థ్యములను కరుణతో నొసంగుము!

దేవా! నీవు భక్తవత్సలుడవు! దీనులపాలిటి కల్ప వృక్షమవు! నీవు తప్ప నాకింకెవరు దిక్కు? నిన్నె ఆశ్ర యించితిని. అసత్తునుండి సత్తునకు గొనిపొమ్ము! తమస్సునుండి జ్యోతిలోనికి తీసికొనిపొమ్ము! మృత్యువునుండి అమృతత్వ మును పొందింపజేయుము. ఇదే మావినతి. అనుగ్రహింపుము. నీదరి జేర్చుకొనుము! పాహిమాం, పాహిమాం, పాహిమాం, పాహి!! ఓం తత్ సత్.

---

[ఈ ప్రార్థనను ఎవరు ప్రతిదినము నియమము తప్పక ఉదయము నిద్రలేచునపుడును, రాత్రి పరుండబోవునపుడును మనస్ఫూర్తిగ పఠించుదురో, అట్టివారికి జీవితమునం దేలాటి దోషములున్ను కలుగకుండుటయేగాక సర్వే శ్వరునియొక్క అనుగ్రహమునకున్ను వారు పాత్రులు కాగలరు.]

## -• సామూదాయిక భగవత్ప్రార్థన •-

౧. ఓమ్ ఓమ్ ఓమ్

౨. (1) ఓం నమః శివాయ (6 సారులు)

(2) ఓం నమో నారాయణాయ (6 సారులు)

(3) ఓం నమో భగవతే వాసుదేవాయ (6 సారులు)

(4) శ్రీరామ జయరామ జయజయరామ (6 సారులు)

3. హరే రామ హరే రామ రామ రామ హరే హరే!
హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే।
(6 సారులు)

## -* శ్రీ భగవన్నామ సంకీర్తనమ్. *-

శ్రీ గణనాయక నమో నమో-సిద్ధివినాయక నమో నమో
నాగవిభూషణ నమో నమో-నవ్యసుభాషణ నమో నమో
పార్వతీనందన నమో నమో-పాపనికృంతన నమో నమో
సర్వజనస్తుత నమో నమో-సర్వశుభప్రద నమో నమో. 1

శ్రీకృష్ణానంద ముకుంద మురారే వామన మాధవ గోవింద
శ్రీధర కేశవ రాఘవ విష్ణో లక్ష్మీనాయక నరసింహ. 2

గోవింద గోవింద హరే మురారే
గోవింద గోవింద రథాంగపాణే
గోవింద గోవింద ముకుంద కృష్ణ
గోవింద గోవింద నమో నమస్తే. 3

నమామి నారాయణ పాదపంకజం
కరోమి నారాయణ పూజనం సదా
వదామి నారాయణ నామ నిర్మలం
స్మరామి నారాయణ తత్త్వమవ్యయమ్. 4

చింతయామి హరిమేవ సంతతం
మందమంద హసితాననాంబుజమ్
నందగోప తనయం పరాత్పరం
నారదాది మునిబృంద వందితమ్. 5

శ్రీకృష్ణ గోవింద హరే మురారే
హేనాథ నారాయణ వాసుదేవ. 6

రామ రామ రామ రామ రామనామతారకం
రామ కృష్ణ వాసుదేవ భక్తిముక్తి దాయకమ్॥
జానకీమనోహరం సకలలోకనాయకం
శంకరాది సేవ్యమాన దివ్యనామ కీర్తనమ్. 7

శ్రీకృష్ణ చైతన్య ప్రభు నిత్యానంద
హరే రామ హరే కృష్ణ రాధే గోవింద. 8

నామస్మరణా ధన్యోపాయం-నహి పశ్యామో భవతరణే
రామ హరే కృష్ణ హరే-తవ నామ వదామి సదా నృహరే.

చంద్రశేఖర చంద్రశేఖర చంద్రశేఖర పాహిమామ్
చంద్రశేఖర చంద్రశేఖర చంద్రశేఖర రక్ష మామ్. 10

శంభో శంకర గౌరీనాథ సాంబసదాశివ సర్వేశ
చంద్రచూడ గంగాధర పురహర సర్పవిభూష శ్రీగిరీశ. 11

రఘుపతి రాఘవ రాజారామ్ పతితపావన సీతారామ్
ఈశ్వర అల్లా తేరేనామ్ సబ్ కో సమ్మతి దే భగవాన్.
సుందర మాధవ మేఘశ్యామ్ గంగా తులసీ సాలగ్రామ్
చండకిరణ కులమండన రామ్ శుద్ధ బ్రహ్మ పరాత్పర రామ్
భద్రగిరీశా సీతారాం భక్తవత్సలా సీతారాం. 12

## 13. కీర్తన.

1. పరోపకారీ భక్తుండెవడో వాడే నిజగము వైష్ణవుడూ
మేలుంజేసియు నేజేసితినని మిగులుగ బల్కని వాడెవడో॥

2. సర్వప్రపంచపు మానవకోటికి సాష్టాంగముగా దండమిడి
నిందలజేయక తను మనుభాషల నిశ్చలుడైనా వాడెవడో॥ప

3. సర్వజీవముల నెల్లవేళల తనసమానముగ మదిలో నెంచి
పరధన పరస్త్రీ దూరత సత్యము వెరువక బల్కెడు
వాడెవడో ॥ప॥

4. మాయల జేయక మోహమునొందక మదిలో వైరాగ్యము
బూనీ। రాముని నామము చెవి బడినంతనె రంజిలుమది
గలవాడెవడో ॥ప॥

5. కామ క్రోధ లోభ మాదిగాగల శత్రువులను బరిమార్చి
ఘనుడౌ భక్తుడె పూజ్యుడు వానిని గన్న తరింతురు యీ
ధరణిన్ ॥ప

6. గాంధిమహాత్ముడు జైలున కేగుచు గానము జేసిన గేయ
మిది। గాంధిమహాత్ముని శిష్యులపాలిటి కల్పవృక్షమై
తనరు నిదీ ॥ప॥

14. కేదారగౌళరాగము — చాపుతాళము.

ప. నేడు మనమందరము గూడి-పాడుదము పరమేశుని
గొనియాడుదము పరమేశుని ॥నేడు॥

అ. ఈడు జగముల లేక యంతట
హెచ్చు వెలిగెడి జ్యోతిని ॥నేడు॥

చ. కందరంబుల మందిరంబుల గహనపర్వతసీమల
సుందరధ్వనితోడ యోగులు స్తుతులొనర్చెడి దేవుని॥ నేడు

2, చెట్టు చెట్టున కాననంబుల జెలగి మధురరుతంబుల
పిట్ట లెవనిని పాడుచుందునో ప్రీతిసాగరు నాతని ॥నేడు॥

3. నూతులందున చెఱువులందున లోతు తెలియని వార్ధిలో
శీతజలములఁ గ్రోలి కీర్తనచేయు జలచర మాతని ॥నేడు॥

4. ఉత్సవంబుల నుల్లమలరఁగ నువిద లెవ్వని పాడుచు
ఉత్సహింతురో యా దయామయునుత్తమోత్తమపురుషుని॥

5. శూరులును వీరాధివీరులు శుద్ధహృదయాంబుజముల
సారెసారెకు నెవనిదలతురో సత్స్వరూపు పరేశుని ॥నేడు॥

15. బేహాగ్ రాగము_ఆదితాళము.

ప. మఱి రాదుగ యీ మానవజన్మము॥

అ॥ పరమ పురుషు కృప-వలనని కలిగెను॥ మఱి॥

చ. పరమేశుని వో-పరమాద్భుతముల
దరిశన మొనరింప-దగు యంత్రం బిది॥ మఱి॥

16. కీర్తన - ఆదితాళము.

ప. సాక్షియె సద్గురుడూ-నీలో సాక్షిని గనరయ్యా॥

1. ఎంత చదివినా ఎంత నేర్చినా సుంతసాక్షి కరుణా లేనిదే అంతయునూ సున్నా॥ సాక్షి॥

2. తప్పులు సేయకుడీ చేసినశిక్షించును సాక్షి-సాక్షిమాత్రుండై సర్వేశ్వరుడు సకలమునందు వసించు నట్టియా - సాక్షియె సద్గురుడూ మీలో సాక్షిని గనరయ్యా॥ సాక్షి॥

3 సాక్షియె బ్రహ్మా, సాక్షియె విష్ణువు, సాక్షియె దేవుం డీశ్వరుండును సాక్షియె సాక్షాత్ పరబ్రహ్మము॥ సాక్షి॥

4 వ్యాసాశ్రమమున, భజనబాబుఇట సద్గురుమూర్తిని గొలిచి నట్టి యా, సాక్షియే సద్గురుడూ మీలో సాక్షిని గన రయ్యా॥ సాక్షి॥

16. శంకరాభరణము - ఆది.

కలికల్మషనాశనమంత్రం। శ్రీరామనామమంత్రం.

1. కలికి భిక్షువును। కామక్రోధముల। కాలచక్రమునజిక్కి। క్రుక్కి కష్టమందనేల॥మానవ॥ కష్టమంతనేలా॥ నారదాది మహామునీంద్రులు నమ్మి తరించిన రామనామం॥కలికల్మష॥

2. మానసమున మహిలోనికలిమి బహుభోగములను శాశ్వత మనితలచి మహిత నరకముల పడనేలా॥నరుడా॥ మహిత నరకముల బడనేలా. ధ్యానగమ్యు పదధ్యానమొనర్చి ధన్యత నొందగలేవా॥నరుడా॥ కలి॥

3. వలచిన దలచిన గొలచిన భవభయము బాపి దగ ధన్యత గూర్చును ॥కలికల్మష॥

4. అక్షయమని మలయాళీమహర్షి యొసంగిచ్చిన మహామంత్రంబిదే సాక్షిసాధు శ్రీభజనబాబు సతతము స్మరణము జేసెడి మంత్రం ॥కలికల్మష॥

18. మోహన - చతు - ఆది

కృష్ణ కృష్ణ కృష్ణా యను మనసా అన్యచింత నీకేందుకే మనసా ॥కృష్ణ॥

(1) హెచ్చుగ ద్రవ్యము మోసకృత్యముగ నెంత కూడబెట్టిన నెపుడైననువచ్చు మృత్యువే కృతముగనైనను వలదన బోదదు వారింపగనెటు ॥కృ॥

(2) తుచ్ఛ సుఖంబుల కాశించియు నీయిచ్ఛవచ్చినటు తిరుగకే మనసా అచ్చముగ దూరము నాలోచింపగ నస్వతంత్రపుం బ్రతుకిది మనసా ॥కృ॥

(3) నిరతము కృష్ణుని స్మరియించిన మది నీకు యమునిబాధ లెపుడు గలుగవు నిరంతరము సత్యమువచించుమా నీ కష్టార్జితమే భుజించుమా పరులనెపుడు దూషణ సేయకుమా పాటుబడుమా దేవదేవు కృపకై ॥కృ॥

(4) వినయముంచుమా పెద్దల పొడగని విశ్వమయుని కథలాకర్ణించుమా నినుగని కాలుడు ఘనముగ బెదరును నీ నీతికి హరి సంతోషించును ॥కృ॥

5. భక్తుల వచనాలే తిరుమంత్రంబుగ బాలించుమా శ్రీ సాధు
వచనముల బాగుగానమ్మి సాధువచనముల భజనబాబు
వచనంబులే స్థిరముగ ॥కృ॥

రమంతే యోగినః అస్మిన్నితివ్యుత్పత్తిచే యోగులు హృదయకోశమందు క్రీడించునట్టి ఆనందస్వరూపము. అట్టి రామనామ మవిద్యతత్కార్యభూతమగు సంసారమును నివర్తింపజేయును.

రామనామమే తానగుటకు సాధనములు బెక్కులు గలవు. వానిలో నిష్కామకర్మ వైరాగ్యములు ప్రధానములు. పనిచేయుము. ఫలితమును గోరకుము. అప్పుడు భగవంతుడు ఋణపడును. ప్రతిభూతమందు ఆత్మబుద్ధితో మెలగుము. ఏ జీవికి నపకారము జేయకుము. కామాదిదోషదూషితుడవు గాకుము. సదా బ్రహ్మచింతనము జేయుము. ఇతరులకు తత్త్వమునే బోధింపుము. లోకుల కొరకు సత్యమును మరుగు పరచకుము. ఆత్మసాక్షిగా పనిజేయుము. సర్వాంతర్యామియగు చైతన్యమును సర్వవస్తువులందు జూడుము. అప్పుడు సర్వమానవ సౌహార్ద్రి మేర్పడును. జ్ఞానపూర్వకమగు భక్తిని నభ్యసింపుము. జ్ఞానమువలన అజ్ఞానమునశించి రామనామము యొక్క నిజస్వరూపము గోచరించును. అవిద్యానివృత్తి పూర్వకబ్రహ్మభావమే మోక్షము. పై సాధనాభ్యాసమువలన మోక్షము నందెదవు.

19. భగవన్నామమె మార్గమండి.

శ్రీరామ్ జయరామ్ జయజయరామ్ ఓమ్ – శ్రీరామ్ జయరామ్ జయజయరామ్ ఓం—

1. మహిమాన్వితమగు మానవజన్మము కలుగుట యిలలో దుర్లభము-సుర్లభమైనా మానవజన్మను, దుఃఖము లకు గురిజేయకుడీ-ఓం శ్రీరాం జయరాం జయజయరాం ...

2. పశుప్రవృత్తి అజ్ఞానంబందున పడియుండుట ఏహ్యాం బండీ మానవత్త్వమును తరచిచూడవలె, మనకర్తవ్యంబది నుండీ-ఓం శ్రీరాం జయరాం జయజయరాం ఓం...

3. సర్వభూతముల హృన్నివాసుడగు శ్రీహరి మనలో కలడండీ-శ్రీహరి దాసులమగుట యెటులనో, మానవజీవిత గమ్యమండీ-ఓం శ్రీరాం జయరాం జయజయరాం ఓం...

4. సర్వమతంబులసారంబిదియని స్పష్టముగా మీారెరు గండి-అహంభావమును నిర్మూలించి, ఆత్మార్పణమును చేయండి- ఓం శ్రీరాం జయరాం జయజయరాం ఓం శ్రీరాం

5. భక్తిభావములో భగవత్పదముల బహుభంగుల సేవించుటయే-ఆత్మార్పణమున కంతరార్థమని ఆర్యులు తెల్పిన సూత్రమండి, ఓం శ్రీరాం జయరాం జయజయరాం ఓం శ్రీరాం ...

6. భగవదనుగ్రహ మున్నట్లైతే, భక్తిభావమూ కలుగు నండి, భగవదనుగ్రహపాత్రులమగుటకు భగవన్నామమె మార్గమండి ఓం శ్రీరాం జయరాం, జయజయరాం ఓం శ్రీరాం జయరాం జయ జయ రాం ఓం. ... ... ..

20. కీర్తన - ఆదితాళం - శుద్ధబంగాళారాగం.

ప. రామభక్తి స అ ఆంబ్రా ఆజ్యం ౦౦౦
యేమానవులా కాబ్బెనో మనసా ||రా||

అ. ఆ మానవులా సందర్శన అ- అత్యంతా బ్రహ్మానంద
మే ఎ ఎ ఎ మనసా ॥రా॥

చ. యీలగని వివరించతేను చాలాస్వానుభవ-వే ఎ ఏ జ్యా
మేలీలాసృష్టీ - జగాత్రయమున కోలాహల త్యాగరాజ
నుతుడా ॥రామభక్తి॥

21. కీర్తన

ప. నన్ను విడచి కదలకురా ॥రామయ్య రామా కోదండ
రామా ॥నన్ను॥

1. నిన్ను వినా పరులా సన్నుతింపనురా రామయ్యరామా॥

2. జానకీ రమణ నాజతబానీ చనబోకు మనసా కుసుమముల
మనసార పూజింతు ॥నన్ను॥

3. రాతి నాతిగజేసి గజరాజును దయజూచిన వైరితమ్ముని
గాచిన శరణాగతవన పాలనా ॥నన్ను॥

4. నీవే గతియని నెరనమ్మితి సీతాపతీ నీవు నన్ విడనాడిన
గతిలేదు గద మరివేరే వినరా ॥నన్ను॥

22: కీర్తన

చాల్ చాల్ ఓమనసా సంసారం ఖిక నీకు ॥చాల్॥

1. సారసాక్షు భజనజేసి సద్గతిని బొందరాద
కపటవృత్తి మానరాద క్రౌర్యమింక విడువరాద ॥చాల్॥

2. పుత్ర ధన వాంఛలందు మత్తుగాను తిరిగెదవు
సత్యవస్తు వెరుగవు అసత్యమువె నమ్మెదవు ॥చాల్॥

3. యాత్ర లెన్నో జేసితినని వెర్రివలె తిరిగెదవు
ఏకమైన త్రికూటయాత్ర నీవెరుగవాహా ॥చాల్

4. సాధుగోష్ఠిలోన చేరి సద్భక్తితోడ గూడి
స్కంధాపురీసునైన సారసాక్ష వెఱగవాహ ॥చాల్

23. సౌరాష్ట్రరాగం - ఆదితాళం

ప. శరణం భవకరుణామయి కురుదీనదయాళో
కరుణారస వరుణాలయ కరిరాజకృపాళో ॥శ
అ. అధునాఖిలు విధినామయి సుధియామురభరితం ॥శ
మధుసూదన మధుసూదన హరమామక దురితం ॥శ
వరనూపురధర సుందరకరశోభిత వలయ
సురభూసుర భయవారక ధరణీధర కృపయా
త్వరయా హర భయమీశ్వర సురవర్య మదీయం
మధుసూదన మధుసూదన హర మామక దురితం ॥శ॥
ఘృణిమండల మణికుండల ఫణికుండల శయన
అణిమాది సుగుణభూషణ మణిమంటప సదన
వినతానుత ఘనవాహన మునిమానస భవన
మధుసూదన మధుసూదన హర మామక దురితం ॥శ॥
అరిభీకర హలిసోదర పరిపూర్ణ సుఖాబ్జే
నరకాంతక నరపాలక పరిపాలిత జలధే
హరిసేవక శివనారాయణతీర్థ పరాత్మ
మధుసూదన మధుసూదన హర మామక దురితం ॥శ॥

24. కీర్తన

1. కుండలి యోగము నెరిగినందు కాదండి యెరుకసాక్షి
బండప్రపంచము నిజానిజములకు భగవంతుడె సాక్షి ॥కుం॥
2. గురుభక్తుండై బరగినందులకు భ్రమలుడుగుటె సాక్షి
సరివైరాగ్యము సలిపినందులకు గురికుదురుటె సాక్షి ॥కుం॥

3. సతతము సాంఖ్యము యెరిగినయెడ మితహారమె సాక్షీ
అతినిర్మల సద్గతిగన్నందుకు వెతలుడుగుటె సాక్షీ ॥కుం॥
4. వేదరహస్యం బెరిగినందులకు క్రోధముడుగుటె సాక్షీ
పొందుగ బ్రహ్మజ్ఞానం బెరిగితె సాధులగుటె సాక్షీ ॥కుం॥
5. హంస నంటినందుకు విషయాదులు ధ్వంసమగుటె సాక్షీ
అవసర మంతయు దీరినంతనె సంశయముడుగుటె సాక్షీ॥
6. మదిలోపల మద్గురు పదములు మరువనిదె సాక్షీ
సతతంబును శ్రీరామ లక్ష్మీశ్వర సరళిగనుటె సాక్షీ ॥శ॥

25. భూపాళ - అటతాళం

శ్రీమతే రామానుజాయను-నామమే శ్రీరామనామము
ప్రేమతో హరిదాసులకు-ప్రియమైన యీనామం ॥శ్రీరామ॥
1. ఆది మూలంబునకు మొద-లాధారమైనది రామనామము
సాధులకు సద్భక్తులకు-సద్బోధ యీనామం ॥శ్రీరామ॥
2 అండపిండాండములకును-బ్రహ్మాండమైనది రామనామము
నిండు షోడశకళలుగల-యఖండమీనామం ॥శ్రీరామ॥
3. బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులు-సన్నుతించినరామనామము
యిమ్మహి జనులకును-మోక్షంబిచ్చు యీనామం॥
4. పార్వతికి యుపదేశమై-పంచాక్షరైనది రామనామము
సరస్వతికి చతురాక్షరైనది-ధ్యానమీనామం ॥శ్రీరామ॥
5. స్నానసేమము దానముల-కాధారమైనది రామనామము
జ్ఞానులకు సన్న్యాసులకు-సంప్రీతి యీనామం ॥శ్రీరామ॥
6 నారదాది మహామునీంద్రులు-నమ్మికొలిచిన రామనామము
పరమపదమును బొందజేసెడి-పఠన మీనామం ॥శ్రీరామ

7. రామ నామము జేయువారికి-ఆపదెన్నడు లేదు నిత్యము
తొలుగు దోషము-బాయుపాపము పొందుపుణ్యములు॥
8. దాసులకు తద్దాసు రంగాదాసు నేలిన రామనామము
వాసిగా శ్రీనివాస రాఘవ-దేశికుని నామం॥శ్రీరామనామం

26. సామరాగం - ఆదితాళం.

శాంతములేకా సౌఖ్యములేదు సారసదళనయనా
దాంతునికైన వేదాంతునికైన ॥శాం
1. దారసుతులు ధనా ధాన్యము లుండిన
సారెకు జపతప సంపదగలిగినా ॥శాం
2. ఆగమ శాస్త్రము లన్నియు జదివిన
బాగుగ సకలహృద్భావము గలిగినా ॥శాం
3. యాగాది కర్మము లన్నియు జేసిన
భాగవతులాగురు బాగుగ దెలిసినా ॥శాం
4 రాజాధిరాజ శ్రీరాఘవ త్యాగరాజ
వినుత సాధురక్షకునికైన ॥శాం

27. దర్బారు రాగం - ఆదితాళం

గురుసేవకన్న ఆర్జనమేమి యున్నదీ గుణవంతులకు భువిని
ధర జనామరణ దోషము బాపుటకు పెద్ద ధొర యెవ్వ
రయ్యా సద్గురుమూర్తికన్నాను ॥గురు
1. దారా పుత్రాది మోహంబనే తిమిరము దారి తెలియ
నివ్వదూ భూరికలుషములకూ మూలమైనయట్టి పాడు
కొంపను నమ్మకనూ గురుజేరవే ॥గురు

2. త్రివిధ కరణములచే స్థిరయౌవుడని సద్గురుని నమ్మగరాద నవనవయౌవ్వనములు గలిగిన నారీమణుల నమ్మగనేల భువి జెడనేలా ॥గురు

3. కాయము నమ్మిన కష్టమొందుటెగాని హాయిలేదెన్నాటికి మాయదెలిసినట్టి సుబ్బయాచార్యునిజేరి కాయాము దొలగే వుపాయము గనవలెను ॥గురుసేవకన్న॥

28. కీర్తన

నను బ్రోవర శ్రీమన్నారాయణ వేగ నిను నెరనమ్మితి నీలవర్ణ వేగ ॥నను

1. అనుదినమును నాకనులపంతువగాను గనుగొనుటెన్నడు గరుడగమన హరి ॥నను

2. మదనజనక నాహృదయకమలమందు సదయుడవని నిన్ను చాలనమ్మితి వేగ ॥నను

3. కంచి నగరమందు కరుణతో నెలకొన్న చంచలనిలయుడ జాలమేలర వేగ ॥నను బ్రోవర

29. కాంభోజిరాగం - ఆదితాళం

శ్రీరామ జయరామ శృంగార రామయని చింతింపరాదె ఓమనసా ॥శ్రీరామ

1. తళుకుచెక్కిలి ముద్దుబెట్ట కౌసల్య మును తపమేమిజేసెనో తెలియా ॥శ్రీ

2. దశరథుడు శ్రీరామాయని పిలువా తపమేమి జేసెనో తెలియా ॥శ్రీ

3. తనివార పరిచర్య జేయ సౌమిత్రి
తపమేమి జేసెనో తెలియా ||శ్రీ

4. తనవెంట జనజూచి వృష్ణాంగ కౌసికుడు
తపమేమి జేసెనో తెలియా ||శ్రీ

5. శాపంబడగి రూపవతి యవుట అహల్య
తపమేమి జేసెనో తెలియా ||శ్రీ

6. ధర్మాత్ము శరణంబునోక శివుచాపంబు
తపమేమి జేసెనో తెలియా ||శ్రీ

7. తన తనయ నొసగి కనులారగన జనకుండు
తపమేమి జేసెనో తెలియా ||శ్రీ

8. దహరంబు కరగ కరమునుబట్ట జానకి
తపమేమి జేసెనో తెలియా ||శ్రీ

9. త్యాగరాజాప్తయుని పొగడ నారదమౌని
తపమేమి జేసెనో తెలియా ||శ్రీ

30. శుద్ధసావేరి _ రూపకతాళం.

ప. కాలహరణ మేలరా హరే సీతారామ ||కాల

అ. కాలహరణమేల సుగుణజాల కరుణాలవాల ||కాల

1. చుట్టుచుట్టి పక్షులెల్ల చెట్టువెదకురీతి భువిని
పుట్టగానె నీపదములు పట్టుకొన్న నన్ను బ్రోవ ||కాల

2. పుడమిని ఎంతాడు కొన్న భూమిని త్యాగంబురీతి
కడువెలసియున్న నీవుగాక ఎవరు నన్ను బ్రోవ ||కాల

3. దినదినమును తిరిగి తిరిగి దిక్కులేక శరణుజొచ్చి
తనువు ధనము నీదేయంటి త్యాగరాజవినుత రామ ||కాల

31. శంకరాభరణ రాగము.

ప. మనసు స్వాధీనమైన ఆఘనునకు
'మరి మంత్ర తంత్రము లేల||

అ. తనువు తానుగానని ఎంచు వానికి
తపసు చేయగనేలా దశరథబాల||

చ. అన్ని నీవనుచు ఎంచిన వానికి
ఆశ్రమ భేదములేల
కన్నుగట్టు మాయలని ఎంచువానికి
కాంతల భ్రమలేల దశరథబాల||

2. ఆజన్మము దుర్విషయ రహితునకు
గతాగతము లికయేల
రాజరాజేశ నిరంజన నిరుపమ
రాజవదన త్యాగరాజ వినుత||

32. ఆనందభైరవి రాగం.

నన్ను విడచి కదలకురా వదలకురా ||నన్ను

1. నిన్నెడబాసి అరనిముస మోర్వనురా
అరగడియ తాళనురా |నన్ను

2. ఒడలు దగిలియున్న వేళ గొప్పవడగండ్లు
గురిసినట్లాయె నీవేళ |నన్ను

3. అబ్ధిలో మునిగి శ్వాసమునుబట్టి ఆణి
ముత్యము గన్నట్లాయె శ్రీరమణా |నన్ను

4. తరముగాని ఎండవేళ కల్పతరునీడ
దొరకినట్లాయె నీవేళ |నన్ను

5. వసుధను ఖననము జేసి ధనభాండ
మబ్బినరీతి గనుగొంటిడాసి ।నన్ను
6. బాగుగ నన్నేలుకోరా అల్లత్యాగరాజ
నుత తనువు నీదేరా ।నన్ను

33. కీర్తన.

రఘురామనామ స్మరణామృతపానమే
కామిత ఫలదాయకమౌగా ।రఘు
1. సంసార దుఃఖసాగరము తరింపగ నావికయై యలరారు
గదా–కామ క్రోధ లోభ మోహముల కాల్చి కాల్చి మసి
చేయు గదా ।రఘు
2. తనువు విడచి జీవాత్మ యరుగగా తలవాకిట బడవైతురుగా–
అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుని అనుదినమును స్మరి
యింపు డికన్ ।రఘు

34. కీర్తన.

వదలకు మార్గము వరమార్గమ్మున వర్తిలుచుండవె యో
మనసా।
సదమలభక్తిని స్వామిని గొలుచుచు సౌఖ్యములొందవె
యోమనసా ॥వద
1. పరుల సుఖమునే పాటించుచు భువి
పనులొనరింపవె యోమనసా
దురిత దవాగ్నిని దూకుచు దారుణ
దుఃఖము లొందకె యోమనసా ।వద
2. సత్యమె సర్వశ్రేయస్కరమని
సతత మెరుంగవె యోమనసా

సత్యవ్రతమును సలిపెడు నప్పుడె
శౌర్యము జూపవె యోమనసా ।వద

3. న్యాయమె సర్వప్రాయము జగతిని
నమ్ముము దృఢముగ యోమనసా
న్యాయము దప్పిన నరకంబుగ భువి
నాడే మారుని యోమనసా ।వద

4 సుగుణరత్నములు సొగసుగ దాల్చి
శోభిలుచుండవె యోమనసా
అగణితగుణ రత్నాకరుడగు
పరమాత్మయె శరణము విను మనసా ।వద

35. కాంభోజరాగం - ఆదితాళం.

ప. మాజానకి చెట్టబట్టగ మహారాజవైతివి ।మా

అ. రాజరాజవర! రాజీవాక్ష! విను రావణారియని రాజిల్లు
కీర్తియు ।మా

చ. కానరేగి యాజ్ఞమీరక మాయాకారము నిచిళిఖ చెంతనే
యుండి దానవుని వెంటనే చని యశోక తరుమూలనుండి,
వానిమాటలకు గోపగించి కంట వధియించక పోయే
యుండి శ్రీనాయక! యశము నీకే కల్గచేయలేద ? త్యాగ
రాజ పరిపాల! ।మా

36. దర్బారురాగం - అటతాళం.

దశరథ రాజకుమార నే నీవశమైయున్నాను చేకొర దశ
ముఖసంహార ధరణిజపతిరామ అసమానతేజ నిన్నాత్మలో
నిలిపియు అనుపమ భక్తిని వేడితిని యినుమంత నీదయ

యుంచు నాపై శశిధరానుత సేవితామర జేసెదను నీ సేవ నిరతము ||దశరథ

1 బాలప్రాయమున కొన్నాళ్లు యౌవ్వనకాలము గడిపి కొన్నాళ్లు యీలాగు కాలము యిలలోన గడిపియు నీల మేఘశ్యామ నిన్ను దెలియనైతిని |మి| చిలుకకును శ్రీరామ యని యాచెలియ వేశ్యయు జెప్పినంతనే లలన బ్రోచిన లక్ష్మీనాయక సలలితంబుగ నేలుమయ్యా |ద|

2. తల్లి దండ్రి తాతవని నాయుల్లములో నమ్మితిని కల్ల మాటలుగావు గారవింపుము తండ్రి ఫుల్లాబ్జలోచన పూర్ణేందువదన నీ యుల్లమున నను కల్లసేయక తల్లి తనయుని బెంచినటువలె నల్లనయ్యా నీకృప వెదజల్లు నాపై కొల్లలుగను |దశరథ|

3. నీపాదములె గతిమాకు మమ్ము యేలుకొను స్వామి పరాకు మాపాల గలిగిన శ్రీపతి యీప్రొద్దు కాపాడి రక్షించు కనకాంబరధర|| కరుణతోడుత నన్ను గావుము కమలములే నమ్మియుంటిని విమలమైన భక్తితోను వేడుచుంటిని నన్ను గావుము |దశరథ|

3. ముక్తిమార్గము దెలియలేను నేనీభక్తిని గూడియున్నాను. యుక్తజ్ఞానము నిచ్చి వచ్చి గారవించి ముక్తిదొరుకునట్టి సూక్తులు దెలుపరా|| భక్తవరద పరాకుసేయకు శక్తి లేకనె యున్నవాడను ముక్తిదాయక మోక్షమొసగుము మాధుసని మదిదలవకను శ్రీ |దశరథ

5. అంగలూరు పురనివాస సీతాంగన పతిభక్తపోషణ
అంగజ జనక విహంగరాట్తురంగ రంగవిపత్సరం
పరోత్తుంగ యో సంగరహిత మునీంద్రసన్నుత
భంగ భయభవభంగ శ్రీరఘుపుంగవా నను భంగపెట్టక
రంగుమీరగ బ్రోవుమయ్యా ॥దశరథ

6. నాగభూషణదాసు కృపను నిన్ను బాగుగ వేడితి ధరను
సాగరశయన యోసజ్జనసేవిత యోగిజనస్తోత్ర యోభక్త
మందార॥ తగవు సేయక మద్దిరామయదాసు మొరవిని
వేగమే నను తగినవరములిచ్చి నీనగుమొగ మిటుజూప
వయ్య దశరథ రాజకుమార॥

37. మాయామాళవగౌళరాగము — రూపకతాళము.

ప. తులసీదళములచే సంతోషముగా పూజింతు॥

అ॥ పలుమారు చిరకాలము—పరమాత్ముని పాదములను॥తుల

చ. సరసీరుహ పున్నాగ—చంపక పాటల కురవక
కరవీర మల్లికా సు—గంధరాజ కుసుమముల్
ధర నివి యొకపర్యాయము—ధర్మాత్ముని సాకేత
పురవాసుని శ్రీరాముని—వరత్యాగరాజనుతుని ॥తుల

38. తోడిరాగము — రూపకతాళము.

ప. ఆరగింపవే పా—లారగింపవే!

అ. రఘువీర జనకజాకర—పవిత్రితమైన వెన్న

చ. సారమైన దివ్యాన్నము—షడ్రసయుత భక్షణములు
దార సోదరాదులతో—త్యాగరాజవినుత ॥పాలార

39. మంగళము-సౌరాష్ట్రరాగము-ఆదితాళము.

ప. నీనామరూపములకు-నిత్యజయ మంగళం ॥నీ

అ. పవమాన సుతుడు బట్టు-పాదారవిందములకు ॥నీ

చ. పంకజాక్షి నెలకొన్న-యంక యురములకు ॥నీ

2. నలినారితీరుగేరు నవ్వుగల మోమునకు ॥నీ

3. నవముక్తాహారములు-నటియించే యురమునకు ॥నీ

4. ప్రహ్లాద నారదాది-భక్తులు పొగడుచుండే ॥నీ

5. రాజీవనయన త్యాగ-రాజవినుతమైన ॥నీ

40. గౌరీరాగము - జంపెతాళము.

ప. జయమంగళం-నిత్య శుభమంగళం॥

చ. మంగళం రుక్మిణీరమణాయ శ్రీమతే
మంగళం రమణీయమూర్తయే తే
మంగళం శ్రీవత్సభూషాయ శార్ఙ్గిణే
మంగళం నందగోపాత్మజాయ! ॥జయ

2. పూతనా కంసాదిపుణ్య జనహారిణే
పురుహూతముఖ దేవహితకరాయ
సూతాయ విజయస్య సుందరముఖాబ్జాయ
శీతకిరణాది కులభూషణాయ ॥జయ

3. కాళియఫాళిమణిరంజితపదాబ్జాయ
కాలాంబుదశ్యామదివ్యతనవే
కారుణ్యరసవర్షి నయనారవిందాయ
కళ్యాణగుణరత్న వారినిధయే ॥జయ

4. నవనీతచోరాయ నందాదిగోపగో
రక్షిణే గోపికావల్లభాయ
నారదమునీంద్రనుత నామధేయాయ తే
నారాయణానందతీర్థగురవే ॥జయ

శ్లో. మంగళం భగవన్ విష్ణో మంగళం మధుసూధన!
మంగళం పుండరీకాక్ష! మంగళం గరుడధ్వజ. ౧

నీలాచల నివాసాయ నిత్యాయ పరమాత్మనే
సుభద్రాబలభద్రాభ్యాం జగన్నాథాయ మంగళమ్॥ ౨

మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాబ్ధయే
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళమ్॥ ౩

వేదవేదాంతవేద్యాయ మేఘశ్యామలమూర్తయే
పుంసాంమోహనరూపాయ పుణ్యశ్లోకాయ మంగళమ్ ॥౪

ఉపనయతు మంగళం వస్సకలజగన్మంగళాలయశ్శ్రీమాన్
దినకరకిరణ నిబోధిత నవనళినదళ నిభేక్షణో రామః. ౫

శ్లో. కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనా వా ప్రకృతేః స్వభావాత్
కరోమి యద్యత్సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి.

క. నీపాద కమలసేవయు
నీపాదార్చకులతోడి నెయ్యమును నితాం
తాపారభూతదయయును
తాపసమందార! నాకు దయసేయగదే.

శా. నీపద్యావళు లాలకించు చెవులున్ నిన్నాడువాక్యమ్ములున్
నీపేరంబని సేయు హస్తయుగమున్ నీమూర్తిపైచూపులున్
నీపాదంబులపొంత మ్రొక్కుశిరమున్ నీసేవపై జిత్తముల్
నీపై బుద్ధులు మాకునిమ్ము కరుణన్ నీరేజపత్రేక్షణా !"
రమా రమణ గోవిందో హరిః

## శ్రీ భగవద్గీతా స్తుతి గీతములు

41. బేహాగ్ రాగం - ఆదితాళం (సంస్కృతం)

ప. జయజయజయజయభగవద్గీతే-జయభవబంధనశమనసుచరితే
1. కాండత్రయ సంశోభితరూపే-ఖండిత త్రిభువన ఘనసంతాపే॥
2. సాంఖ్యకర్మయోగవిలసితే-సంశ్రిత సాధక జనకల్పలతే॥
3. పద్యసప్తశత భవ్యతరంగే-పాపవిభంజన పావనగంగే॥
4. భక్తిజ్ఞాన సోపానశోభితే-పరమయోగి హృత్పద్మభావితే ॥జ
5. భగవత్ శ్రీముఖ పద్మమరందే-పార్థహృత్సదనభరితానందే
6. సకలోపనిషత్ సాగరజాతే-సన్మునిమథవాచలపరిపూతే ॥జ॥
7. శాంతిసుఖప్రద సదమృతకిరణే-జననమరణ భవసాగరతరణే॥
8. భజనసమాజ సుభక్తహృదబ్జే-పరిపూజిత పావనపదాబ్జే॥జ

42. బేహాగ్ రాగము - ఆదితాళము. (తెనుగు)

ప. తల్లీ ! భగవద్గీతా ! మా॥
అ. ఉల్లములందున-నుండుము మాతా ॥తల్లీ
1. తెలివిమాలి నీ-దెస చూడని మము
తులువల మనుచును-దూరము సేయకు ॥తల్లీ
2. మతమత్సరముల-మదిలో నిడుకొని
వదలితి మమ్మ నీ-పదయుగళంబును ॥తల్లీ

3 నిన్ను భజించక-యే కళ మే మిటు
లెన్నో జన్మము-లెత్తుచునుంటిమి ॥తల్లీ

4. జననమరణముల-చక్రములోఁ బడు
తనయుల నిపుడొక-దారిని జేర్చుము ॥తల్లీ

5. భవకూపంబునఁ – బడి నినుఁ గాంచని॥
మముఁ గని తప్పుల – మన్నింపఁగ దే॥ తల్లీ॥

6. చేయూఁత నొసఁగి – శిశువుల మగుమము॥
చేరఁదీసి నీ – చెంతను నిలుపుము॥ తల్లీ॥

7. అన్నిభూతముల – యందు వెలింగెడి॥
హరిఁ దనునటు లో – యమ్మ! దీవింపుము॥ తల్లీ॥

8. గీతాభక్తుల – గీతము విని సం॥
ప్రీతిని శాంతిని – వే దయచేయుము॥ తల్లీ॥

## గేయములు

### 43. శ్రీరాగము _ ఆదితాళము.

భగవద్గీతోద్యానవిహారము భక్తి నొనర్పఁగ పరుగునరండీ
సొగసుగదానినిజూడగనద్యోదునులువగుత్రోవను జూపెదనండీ॥

1. భారతయుద్ధపు పరిసరభూముల బయలుదేరిన భాగ్యంబండీ
ధీరుడువ్యాసుడు స్థిరముగనాటినదివ్యోద్యానక్షేత్రముసుండీ

2. రహి నిల కృష్ణుడు రక్తితో పార్థుని రథమును నడిపిన
రంగంబండీ ఇహపరసుఖకర హేతుభూతముల నెన్నియొ
యాతడు పన్నినదండీ॥

3. ఇలపయినది పదియెన్మిదియౌ ఆకరంబుల పరిమితి రాజిలు
నండీ సలలితముగ నట సప్తశతంబుల సద్వృక్షంబులు
జెలగును జూడండీ॥

4. ఎప్పుడు వాడని పూవులుచుండీ ఎప్పుడు కుళ్ళని ఫలములు నుండి తప్పక మనమా ధన్యవనికి జని తలకొక కొన్నిటి దెత్తము రండి॥

సీ. హృదయమా ! నీమేలు మదిగోరి తెల్పెద
నొకమాట వినుమ నీ వోర్పు గల్గి
యిలలోన హేయమౌ యెనుబది నాల్గు ల
క్షల యోనులందెల్ల జననమంది
మితిలేని వెతలొంది గతిగానలేక
పుట్టుచు గిట్టుచు దుట్టతుదకు
నన్నింట నుత్కృష్టమౌ నరజన్మ నీ
పుణ్యవశంబున బొందగలిగె

గీ. పరమ పదవిని బొందగా దరుణమిదియె
శంకరుని జేర గడసారి జన్మమిదియె
యిట్టి నరజన్మ మెత్తియు నింకనైన
తండ్రి దారు గాంచకున్నావు తగునె? నీకు.

సీ॥ ఆదికారణ మెన్న రాదుగాని
స్వభావము లోకమని చెప్పు బౌద్ధమతము
జగమబద్ధము బ్రహ్మసత్యం బటంచు
నెంతయు బోధపరుచు అద్వైత మతము
సగుణు డీశుడు ప్రపంచము వాని
యిచ్ఛానిభూతియంచు గణించు ద్వైతమతము
ఇహమె నిక్కము పరంబెల్ల కల్లయటంచు
దెల్లముసేయు నాస్తిక మతంబు

గీ. ఇన్ని మతములలో సార మెంచి యెంచి
దయయు సత్యంబు మొదలగు ధర్మబుద్ధి
నాల్గిటన్ క్రమముగనిల్పి నయముమీర
జయము మనమందవలయునో జనములార.

సీ. వేదధర్మంబులన్ ప్రీతితో నెరపెడివాడును కష్టముల్
బడయుచుండు, భక్తితో దైవమున్ భజియించువాడును
దైవప్రబాధల దైన్యమందు, ప్రబల విద్యను ధనంబార్జించు
వాడును దారిద్ర్యదశచేత దల్లడిల్లు, పాలనం బొనరించు
వరుస ప్రభుండైన కొందరి జనులచే నిందబొందు

గీ. దుర్జనుడును కొందరిచేత స్తోత్రమొందు, కామియును నొక
ప్పుడు మోక్షకామియౌను, మంచి బలవంతుడును నొక
ప్పుడు వంచితుడగు సృష్టిమహిమ మేరినెంచ జెల్లునొక్కొ.

సీ. కాయ కష్టముశేసి కడుపు నింపుచునుండు
డెట్టివేళను సత్యమే వచించు
డిరుగు పొరుగువారి పరిచర్య సలుపుడు
సేవింపు డావుల చిత్తమలర
నిదుర మేల్కొనుతఱి నిదురించుటకు ముందు
శ్రీరామనామంబు జింతజేయు
డెటువంటి వారిపై నిసుమంత పగలేక
నిరతంబు శత్రిమ నెఱపుచుండు

తే. గీ. డీవిధంబుగ నడచిన నిహపరముల
శాశ్వతంబగు సౌఖ్యంబు సంభవించు
పరమపావనులగు మన బ్రహ్మవిదుల
తలచి నుడివిన భారతధర్మ మిదియ.

తే. గీ. మేఘపంక్తుల దాగిన మెరపువోలె
కందరంబుననున్న సింగంబు పగిది
దాగియున్నది నీలోన ధైర్యశక్తి
సోదరా లెమ్ము భారతశోక ముడుప.

గీ. అరణి నంతర్గతాగ్ని కణాలిపోల్కి
వసుధయందలి యాతః ప్రవాహలీల
అణగియున్నది నీలోననంతశక్తి
సోదరా లెమ్ము భారతశోక ముడుప.

గీ. వసుధలో లోనదాగిన పసిడిగనిని
రాచబిడ్డవు పరకుల రక్షితుడవు
మరచిపోతివి నీలోనిమహిమ తెరగు
సోదరా! భారతశోకముడుప.

సీ. మత్స్యరూపముదాల్చి మానుగా
సోమకుని జలధి మధ్యంబున జంపితీవు
కూర్మంబయి దేవకుదురంబు వీపుపై
గోరి వధియించిన గురుడవీవె
ఘోణివై హేమాక్షు ఘోరజలధిలోపల
బోరికొని భూమిని బ్రోవలేదె
నరసింహమూర్తివై బరిమార్చి యాహేమ
కశ్యపుని ప్రహ్లాదుని గావలేదె

తే. అరయ మరగుజ్జువై బలినణప లేదె
రాముడనుపేర రాజుల ద్రాల్పలేదె
కాన నేనెంచ నేనెంతటివాడ నౌర
రఘుకులాంబుధిచంద్ర శ్రీరామచంద్ర.

సీ. అతిభక్తిపరుడైన యర్జును గుర్రాల
కాళిందినదిలోన గడగినాను
సర్వార్పణము సేయజాలి నా బలియింట
కావలివాడనై గాచినాను
కోటి కంటగదీసి దాడింపగా నమ్మ
నోర్చి నోరెత్తక మెచ్చినాను
ఎలమి నరసింహామే దాల్చినట్టి
హుండియా చెల్లించినాను

తే. ప్రతియత్తి యీడెక్క యీనాడు
సక్కుకై కాంతనగుచు నత్త
మామల పాదములొత్త వలసె
భక్తుల నిమిత్తమే గదా యెన్ని పాట్లునైన.

—* శ్రీ గాంధిమహాత్ముని భావము *—

సీ ప్రత్యూదయంబును ప్రథమ కార్యంబుగ
నే జేతుగాక! యీ నియతి ప్రతిన
జగతి నే నెవరికి జడియకుండెద గాక!
భగవంతునకె భయపడుదుగాక!
ఎవ్వారియెడల నే నెడదలో ద్వేషంబు
లేకుండెదనుగాక! లేశమేని
అన్యాయమునకు నే నణగకుండెద గాక!
ఎవరెన్ని దల్చిన నించుకేని
తే. గీ. కల్లయాదాని నిజముచే ఖండనంబు
జేయ జూచెదగాక! సుస్థిరముగాను

మిథ్య నెదిరించు పట్టున మేటిబాధ
లోదువ నెన్నని నోర్పుతో నుందుగాక!

సీ. సలిలంబు నీకు నీగలిగిన వానికి
నిష్టమృష్టాన్నంబు నిడఁగదయ్యా
కేల్మోడ్పు నీకువానికిఁ భక్తిసంయుక్తి
జాగిలి జోహారు సలుపవయ్యా
తృణకణంబేని నీకిచ్చు పుణ్యాత్మున
కపరంజి నాణె మీయంగదయ్యా
కడగండ్ల నీకు దోడ్పడెడివానికి నీ శ
రీరమే గోసి యర్పింపవయ్యా

తే. గీ. యిచ్చుచో నొంకు దశగుణం బిచ్చుటొప్పు
గీడు గూర్చిన మేలుగల్గించు టుఱవు
చిత్తవాక్కర్మ శుద్ధియై జేయు వీని
నెవ్వ డాతండ గెల్చుబో! యిజ్జగంబు.

సీ. కన్నులుండియు నినుఁ గాంచగోరని
వానికన్నను గ్రుడ్డివాడు మేలు
కరములుండియు నినుఁ గైసేయనొల్లని
వానికన్నను లేనివాడు మేలు
నాల్కయుండియు నినుఁ సన్నుతించగబోని
వానికన్నను మూగవాడు మేలు
ధనము గల్గియును సత్కర్మలు జేయని
వానికన్నను పేదవాడు మేలు
నిను దలంచకున్న మనుజునికన్నను
పశువులైన మేలు పరమపురుష

భక్తపారిజాత భవ్యగుణవ్రాత
విగతతృష్ణ వేదవేద్య కృష్ణ!

ఉ. ఏటి నెవ్వానికి నెన్నిరేల్ సుఖముగాని దుఃఖముగాని
విస్ఫుటపూర్వచరితాత్మ కర్మవశతన్ భోక్తవ్యమైయుండునో
ఘటనాచాతురి త్రాళ్లగట్టుచు బలత్కారంబుగా వానినచ్చ
టికిన్ దోడ్కొనిపోయి దానిగుడిపించున్ దైవమన్నాళ్లగన్.

## —* పరబ్రహ్మ దండకము *—

శ్రీరామ! శ్రీకృష్ణ! ఓశ్యామలాకార! నాకన్నతండ్రీ! జగన్నాథ! ఆపన్నివారా! ప్రసన్నాత్మసంవాస! దేవాదిదేవా! మహాదేవ గోవింద! సర్వాత్మ! సర్వజ్ఞ! సర్వేశ! సర్వార్చితా! సర్వశక్తా! హరీ! సర్వసాక్షీ! ముకుందా! పరంధామ! సర్వోత్తమా! నామరూప క్రియాశూన్య! జ్ఞానస్వరూపా! అనంతాచ్యుతా! అప్రమేయా! కళాపూర్ణ! తేజోమయా! సత్యసంకల్ప! స్వామీ పరబ్రహ్మమూర్తీ! మొదల్ నిన్ను నేనెన్నడో యెందుకో బాసి అన్నింటియందున్న నిన్గానకెన్నెన్ని జన్మంబులో యెత్తి, యెన్నేని కష్టంబులో పొందితిన్ కుందితిన్ కందితిన్ కావుకావంటి, ఈనేలపై మొన్నపుట్టంగనే గట్టిగానీకు చేయెత్తి నాయాత్మలో మ్రొక్కితిన్ దీనబంధూ దయాసింధు ఈజన్మమందైన నీవాడనై నాకు కైవల్యమీవే తగన్ వేఱు నేనేమియున్ గోర, నోదేవ! దివ్యప్రభావా! భవత్ జ్ఞాన నేత్రంబుతో జూడ, శబ్దంబులోనుండు శబ్దంబుపల్కు, స్పర్శంబులోనుండు స్పర్శంబు నీతాకు, రూపంబులోనుండు రూపంబు నీరూపు, సారంబులోనుండు సారంబు నీతీపి, గంధంబులోనుండు

గంధంబు నీతావి, ఈమన్ను నీమాయ, ఈమిన్ను నీమాయ, ఈగాలి నీమాయ, ఈనీరు నీమాయ, ఈవెల్గు నీమాయ, ఈపంచభూతాత్మకంబౌ ప్రపంచంబు నీమాయ, ఈనేను నీ మాయ, నీమాయయె అన్నియున్, నీవు గమ్మన్నమాత్రాన గాదా? అదేదైన, రమ్మన్న మాత్రాన రాదా? అదేదైన, పొమ్మన్నమాత్రాన పోదా? అదేదైన, నీబల్మియే బల్మి, నీకల్మియే కల్మి, నీవిద్యయే విద్య, నీబుద్ధియే బుద్ధి, నీ తెల్వియే తెల్వి, నీ తేటయే తేట, నీయిచ్ఛయే యిచ్ఛ, నీ రచ్చయే రచ్చ, నీమాటయే మాట, నీపాటయే పాట, నీ యాటయే ఆటయౌ, నీవు నీవే, మహాసత్త్వసంపన్న! నావట్టు గొమ్మైన యీనీవు నాపట్టియైనన్ ననున్ బట్టువారేరి? నన్ గట్టువారేరి? నన్దిట్టువారేరి? నన్ గొట్టువారేరి? ఇందైన అందైన యెందైన నాకడ్డమౌవార లేరీ? విచారింప నీయాజ్ఞ లేకున్న నాకైన నల్లాపునా? నీవు తోడైన ఏమిన్ను నన్ వంచు ఏనీరు నన్ ముంచు, ఏగాలి నన్ దూల్చు, ఏ అగ్ని నన్ గాల్చు, ఏశక్తి నన్ గూల్చు, ఏమైన నన్నేమి చేయున్, బవల్ రేయి బ్రహ్మాండ భాండంబు నందంతటన్ తాండవంబాడు నీదివ్య తేజంబె యుక్కుంగినాకున్ సదా దిక్కు నీవొక్కడే ఎక్కడన్ మక్కువన్ జీవులన్ గావగా, బ్రోవగా, నీకె చెల్లున్, ప్రభూ సద్గురూ! ఓం నమో శ్రీపరబ్రహ్మణే, పాహిమాం పాహిమాం పాహిమాం ఓం నమస్తే నమస్తే నమస్తే నమః.

—*—

నీలాంబరిరాగము - ఆదితాళము

ప. ఎన్నగా మనసుకు రాని-పన్నగశాయి సొగసు
పన్నగ గనుగొనని కన్నులేలే-కన్నులేలే-కంటి- మిన్నలేలే

చ. మోహాముతో నీలవారి-వాహాకాంతిని గేరిన
అ. శ్రీహరిని గట్టుకొనని-దేహమేలే - దేహమేలే - యీ
గేహమేలే

2. సరసిజ మల్లె తులసి విర-జాజి పారిజాతపు
విరులచే పూజించని-కరములేలే-కరములేలే-కాపురములేలే

3 మాలిమిని త్యాగరాజు-నేలిన శ్రీరామమూర్తిని
లాలించి పొగడని-నాలికేలే-నాలికేలే-సూత్ర- మాలికేలే॥

సీ॥ తోమ్మిదిచిల్లుల తోలుతిత్తియగాని
కాన్తి గల్గిన వజ్రఘుటముగాదు
నిమిష నిమిష మిందు నీచులూరునెగాని
పునుగు జవ్వాజీలు పుట్టబోవు
మల మూత్ర దుర్గంధ మాంసరక్తమె కాని
ఘన సువాసనమైన తనువుగాదు
నీచమా యిదివట్టి నీటి బుగ్గయెగాని
కలకాల మిలలోన నిలువబోదు

గీ. భ్రమల బుట్టించి నమ్మించి పాసిపోవు
నిట్టి దేహంబుపై భ్రాన్తియేల నీకు
హృదయమా! నిన్ను రక్షింవదు తుదకు నీదు
కన్నతండ్రియె గతిగాక గలరె? యొరులు.

సీ. పుట్టినదాదిగా భూతజాలంబును
కారుణ్య దృష్టితో గాంచినావు
ధనధాన్య సంపదల్ త్యాగమ్మొనర్చి
వైరాగ్యభావాన వరలినావు
తీవ్రజిజ్ఞాసతో దివ్యతత్త్వంబును
జెందగా ధ్యానంబు జేసినావు
కాపట్య మెఱుగక నోపికతో సదా
సాధుకోటికి సేవ సలిపినావు

తే. స్వార్థభావంబు విడనాడి జంతుకోటి
కష్టములఁదీర్ప నడుముని గట్టినావు
వేంకటేశ్వర స్వామిజీ విమలహృదయ
కొనుము మా ప్రేమకుసుమముల్ కూర్మితోడ.

సీ. సత్యధర్మంబుల జవదాటి నడువక
బటుభోగములచేత బట్టువడక
విషయసౌఖ్యంబుల విడనాడి సతతంబు
పరమాత్మ భావతత్పరత మెలగి
సత్కార్య మనినచో సంతోషమున బొంగి
తను మన వాక్శక్తి ధారబోసి
యార్షమతంబన్న హార్షాబ్ధిలోమున్గి
భవసాగరంబన్న భయముజెంది

తే. గీ. నిత్య నిర్మల పదమునే నెమకి నెమకి
శాంతి దాంత్యాది గుణముల సంగ్రహించి
పూర్ణనిర్వాణపదమును బొందినావు
వేంకటేశ్వరస్వామిజీ విమలహృదయ.

సీ. గాంధీమహాత్ముని ఘనత్యాగమును విని
ఖద్దరు వస్త్రముల్ గట్టినావు
మలయాళిసామిచే మంత్రంబు గైకొని
జపతపముల్ సదా సలిపినావు
పూర్వకాలపు మునిపుంగవులట్టుల
వనవాస దీక్షతో వరలినావు
సాత్వికాహారంబు సరిపడ గైకొని
సత్కార్యముల నెన్న సలిపినావు
తే. త్యాగశీలకు నిలయమై తనరు నీదు
జీవితము సర్వమానవ భావితంబు
వేంకటేశ్వరస్వామి వివేకభావ
కొనుము మాప్రేమ కుసుమముల్ కూర్మితోడ.

సీ. మిత్రలోకంబన్న మిన్నంటు నీప్రేమ
మాహాత్మ్య మెట్టిదో మాన్యచరిత
నాయకత్వము జేసి కడుపు నింపుడమన్న
నీభావగరిమమేమి నిర్మలాత్మ
వేదాన్తవిజ్ఞాన వీధుల చరియించి
తన్మయమొందు నీతత్వమేమి
నియమకాలంబున నిద్రమేల్కొనునట్టి
నీయోపికెట్టిదో నిర్మలుండ
తే. గీ. తలప నీజీవితములోని ధర్మములను
బటుతరంబగు యాదర్శప్రాయములగు

వేంకటేశ్వరస్వామి! వివేకహృదయ
గొనుము మా ప్రేమకుసుమముల్ కూర్మితోడ.

సీ. యౌవనవయసులో నఖిలసుఖమ్ముల
బాసి వనమ్ములో వాసముండి
పుణ్యకార్యంబుల పూర్తిగానొనరించి
కర్మయోగంబును గడిపితీవు
గురుకులంబునముండి గోప్యవేదాంతంబు
శాంతిగ చింతన సలిపితీవు
నామసంకీర్తన ప్రేమతో జేయుచు
భక్తిమార్గంబున ప్రాకితీవు

తే. కడకు పదిరెండు యేడులు గడపి యిట్లు
పూర్ణనిర్వాణపదమును బొందితీవు
వేంకటేశ్వరస్వామి వివేకహృదయ
ధన్యమని నీదు జన్మము దలతుమయ్య.

—*—

ఓం సద్గురుభ్యో నమః.

# శ్రీ శ్రీ శ్రీ సాధు వేంకటేశ్వర స్వామివారి కర్మ, భక్తి జ్ఞాన హితవాక్యములు



"సాధు సద్గుణ సంశీల
స్వాధూనాం హితకారకః
సదా బ్రహ్మణి సంతుష్టః
పరవైరాగ్య ముక్తిమాన్"



జననము 15-1-1910



శ్రీ సాధు వేంకటేశ్వరస్వాములవారు



"అసంసక్తి ప్రపంచేన
సంసక్తి ప్రతిష్ఠాకా
నిష్కళంకో నిర్వికార
అగోచర నిరంజతో"



నిర్యాణము 12-4-1949.

1. కర్మయోగము.

సద్గురుమూర్తి బోధించిన లక్ష్యార్థమునందు దృష్టిని నిలిపి యుంచుము. ప్రపంచమున వ్యవహరించునపుడు సర్వాంత ర్యామియగు పరమాత్మను ప్రతిముఖమునందును దర్శించుచు వినయముగ ప్రవర్తించుము. వైరాగ్యమును మించిన ఐశ్వర్యము లేదు. రహస్యముగ జేయు మంచిచెడ్డల గుర్తించు సాక్షియే భగవంతుడు. తాజేయు మంచిచెడ్డలగూర్చి సాక్షిమాత్రుడగు పరమాత్మ వీక్షించుచున్నాడని గ్రహించినవారు పాపములు జేయజాలరు. భగవన్నియమమునకు విరుద్ధమగు దుష్కర్మ నొకదానిని నీవు చేసిన యెడల మహాదుఃఖము ననుభవింతువు. నీ శరీరము కామోపభోగములకొఱకు గాదు. స్వార్థరహిత మగు సర్వప్రాణికోట్ల సేవకొఱకే. లోకకళ్యాణకరమగు కార్యములే నీకాచరణయోగ్యములు. జాతి, మత భేదములను పాటింపక, సర్వులాత్మస్వరూపులని భావించుము. కర్మనిష్ఠు డగువాడే యోగి. కర్మఫలమును విడుచువాడే త్యాగి. కర్మ యోగమే భుక్తి, ముక్తి. నీమనోవాక్కాయములద్వారా ఏ జీవికి అపకారముజేయక మెలగుము. నీవెప్పుడు భగవ త్స్మృతిని బోగొట్టుకొందువో అప్పుడే దుర్విషయములు నీ మనస్సులో జేరగలవు. పరమాత్మయందు సమర్పణభావముతో నీవు కర్మను జేయుము. ఆర్తితో "హే భగవన్! నేను, నాది తృణమైనను లేదు. సర్వము నీదే" నని నీత్రికరణములను సర్వస్వమును భగవదర్పితము జేసి జీవింపుము, భావింపుము,

పనిచేయుము, భుజింపుము, నిద్రించుము. ఇట్టి కర్మయోగి నిద్ర నిద్ర గాదు. యోగము.

## 2. భక్తియోగము.

సమస్తమార్గములలో భక్తిమార్గమే అత్యంత సులభ మార్గము. దీని నాచరించుటకు తర్క వితర్క పాండిత్యములతో పనిలేదు. అహంకార మమకారములను విడచి జ్ఞానపూర్వకమగు భక్తి నభ్యసింపుము. జ్ఞానమువలన అజ్ఞానము నశించి, రామనామముయొక్క నిజస్వరూపము గోచరించును. "రమన్తే యోగినః అస్మిన్" ఇతి వ్యుత్పత్త్యనుసారము, యోగుల హృదయకోశములందు క్రీడించునట్టి యానందస్వరూపము రామనామము. అట్టి రామనామము అవిద్యాతత్కార్యభూతమగు సంసారమును నివర్తింపజేయును. భగవచ్చింతనాసక్తులై కొందరు నిలిపితురు. ఆ ప్రేమచే గానము చేసెదరు. కొందరాతని లీలకథాజాలమును విని పరవశులయ్యెదరు. కొందరు ఆ మహామహుని అద్భుతవిషయములను వచించెదరు. ఇతర విషయములందు వీరి కిష్టముండదు. భగవంతుని కంటె భగవన్నామమునకు మహాత్ము లెక్కువ విలువనిచ్చిరి. శ్రీరామనామప్రభావమువలన హనుమంతుడు సముద్రమును దాటగలిగెను. శ్రీరామచంద్రమూర్తియో, వారధికట్టియే దాటగలిగిరి. దారుణకష్టములలో సైతము నన్ను రక్షించినది రామనామము. నిరాశాసమయములలో సైతము నాకు ఆశా జ్యోతిని చూపించినది శ్రీరామనామమే. నా జీవితమునకు రామ నామమే రక్షకము.

పనిచేయుము, భుజించుము, నిద్రించుము. ఇట్టి కర్మయోగి నిద్ర నిద్ర గాదు. యోగము.

2. భక్తియోగము.

సమస్తమార్గములలో భక్తిమార్గమే అత్యంత సులభ మార్గము. దీని నాచరించుటకు తర్క వితర్క పాండిత్యములతో పనిలేదు. అహంకార మమకారములను విడచి జ్ఞాన పూర్వకమగు భక్తి నభ్యసింపుము. జ్ఞానమువలన అజ్ఞానము నశించి, రామనామముయొక్క నిజస్వరూపము గోచరించును. "రమన్తే యోగినః అస్మిన్" ఇతి వ్యుత్పత్త్యనుసారము, యోగుల హృదయకోశములందు క్రీడించునట్టి యానందస్వరూపము రామనామము. అట్టి రామనామము అవిద్యాతత్కార్యభూత మగు సంసారమును నివర్తింపజేయును. భగవచ్చింతనాసక్తులై కొందరు విలపింతురు. ఆ ప్రేమచే గానము చేసెదరు. కొందరాతని లీలకథాజాలమును విని పరవశులయ్యెదరు. కొందరు ఆ మహామహుని అద్భుతవిషయములను వచించెదరు. ఇతర విషయములందు వీరి కిష్టముండదు. భగవంతుని కంటె భగవన్నామమునకు మహాత్ము లెక్కువ విలువనిచ్చిరి. శ్రీరామనామప్రభావమువలన హనుమంతుడు సముద్రమును దాటగలిగెను. శ్రీరామచంద్రమూర్తియో, వారధికట్టియే దాటగలిగిరి. దారుణకష్టములలో సైతము నన్ను రక్షించినది రామనామము. నిరాశాసమయములలో సైతము నాకు ఆశా జ్యోతిని చూపించినది శ్రీరామనామమే. నా జీవితమునకు రామ నామమే రక్షకము.

విద్యాభ్యాస కాలమందు వ్రాసియుంచిన కర్మ, భక్తి, జ్ఞాన యోగములు. ఓమ్ తత్ సత్.

పెనమలూరు
1-1-1953

ఇట్లు వీరి అనుచరులు
శ్రీ భజనబాబు
శ్రీ పరమాత్మానందాశ్రమము, పెనమలూరు, కృష్ణాజిల్లా.

## * శ్రీ రామ నామ ప్రభావము *

కలౌ స్మరణాన్ముక్తిః — ఈ కలియుగమునందు భగవత్స్మరణమువల్లనే ముక్తి లభించును.

మహాత్మా గాంధీజీ భావన—

ఆపదలలో గొప్ప ఆపద దైవచింతన లేకుండుటయే, సంపదలలో గొప్పసంపద ఆధ్యాత్మిక మైశ్వర్యమే నా మైశ్వర్యమని తలంచుట.

భగవంతునియందు నాకు పూర్ణవిశ్వాసము గలదు. నాజీవితములోని అనేక కష్టసమయములందు దేవుడు నన్ను రక్షించెను. భోజనము చేయుట, నీరుత్రాగుట, కూర్చుండుట, మొదలగునవి మనకెట్లు నిజమో అట్లే పూజ, ప్రార్థన, ధ్యానముగూడ సత్యము. ఇది అంధవిశ్వాసము గాదు సంపూర్ణమైన సత్యము. నా స్వానుభవ మని, గాంధీజీ తన ఆత్మకథయందు నుడివిరి. కనుక భగవంతుడే నన్ను రక్షించును. అను దృఢమైన విశ్వాసమును గలిగియుండుడు. మన భూములుగాని మన బంధువులుగాని, మన గవర్నమెంటుగాని మనలను

రక్షింపజాలరు. రక్షకులకు రక్షకు డెవ్వండో వానియందే పరిపూర్ణ విశ్వాసమును గలిగి యుండవలయును. ఆటంబాంబు గాని, దానికంటె వెయ్యిరెట్లు శక్తిగలది వచ్చినను నన్ను దైవశక్తియు లేనిదే యేమియుచేయజాలదు. అని ధైర్యముగా నుండుడు. 5 సంవత్సరముల బాలుడు రాజాధిరాజై దేవతలను సయితము తన యాజ్ఞనం దుంచుకొన్న హిరణ్యకశిపుని హరి భయపెట్టెను. కాని ప్రహ్లాదుడు భయపడి తన్ను రక్షించుమని కోరలేదు. పరిపూర్ణ శరణాగతి నొందినవాడు గనుక సర్వమును భగవంతునియందే భారముంచినాడు గాన క్రూరుడై తండ్రి పర్వతశిఖరములనుండి త్రోసివేయించినను భగవంతుడు ప్రహ్లాదుని తన హస్తమునుండి జారనీయలేదు. ఆతని శక్తి యున్నందున నిప్పు, విషముగూడ అనుకూలము నందున్న దాయెను. త్రేతాయుగమునందు జన్మించిన రాముని కలియుగమునందు నమ్మి రామదాసు స్మరణచేసి ఆరాముని యాలయకైంకర్యమునకు ఖర్చుచేసిన హుండీ (ఆరులక్షల పైకము) తానీషాకు రామలక్ష్మణులచే నొసగబడెను. ఓహో! భగవన్నామమునందు విలువ యేమని చెప్పవచ్చు. భూభారమును వహించు ఆదిశేషుని మహానుభావుడైన శివుడు ఆభరణముగ ధరించెను. అంతటి పరమేశ్వరుడుగూడ నిరంతరము రామనామస్మరణము చేయుచు పార్వతీదేవికి తారక మంత్రము నుపదేశించెను. మరియు శ్రీరామ మహిమను పార్వతీదేవి కీవిధముగ జూపించెను.

రావణాసురుడు సీతామహాదేవిని మాయావేషముతో వచ్చి గెడ్డలో నెత్తికొని పోయినప్పుడు రామచంద్రమూర్తి

విలపించుచున్నాడని చెప్పెను. అప్పుడు పార్వతీదేవి స్వామీ! శ్రీరాముడు దేవుడైన విలపించునా యని యడిగెను. ఈశ్వరుడు రాముడు దేవుడు కాడో నీవే పరిశోధించుకొను మనెను. ఆమె సీతాదేవి యవతారము ధరించి విలపించుచున్న రామునికి యెదురాయెను. అంతట సర్వజ్ఞుడైన రాముడు తల్లీ! కైలాసమును వదలి యిచ్చట కెందుకు వచ్చినావని అడిగెను. అంతటామె రాముని ఆహా! రాముని మానవునిగా తలంచితి నని విచారించి, రాముని దైవముగా నిశ్చయించుకొని నమస్కరించి కైలాసమునకు వెళ్లి సాంబశివునితో రాముడు దేవుడే నను నా సంశయము తీరెనని పార్వతీదేవి రామమంత్రస్మరణ చేయుచుండెను.

శ్రీకృష్ణ భగవానుడు గీతయందు చెప్పినట్లు—

శ్లో. క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి
కౌన్తేయ ప్రతిజానీహి నమే భక్తః ప్రణశ్యతి.

తా. నన్ను స్మరణజేయువాడు అతిత్వరగా ధర్మాత్ముడై శాశ్వతమైన పరమశాంతిని బొందుచున్నాడు. నాయందు భక్తిగలవాడు చెడడని భేరీవాయించి రెండుచేతులు పైకెత్తుకొని ప్రతిజ్ఞచేసి చెప్పు మర్జునా! యని సెలవిచ్చెను.

మరియు—

శ్లో. అపిచేత్సుదురాచారో భజతే మామనన్యభాక్
సాధురేవ సమంతవ్య స్సమ్యగ్వ్యవసితో హి సహః.

తా. మిక్కిలి దురాచారము గలవాడైనను అనన్యమనస్సుగలవాడై నన్నే యెవడు భజించునో, వాడు స్థిరమైన

మనోనిశ్చయము గలవాడు గావున వాడు సాధువుగా నెన్న దగినవాడే. దీనివలన పాపిసహితము భగవద్భజన చేయవచ్చు నని తేలుచున్నది. శ్రీ ఉడియా బాబాగారు చెప్పినదిజూడుడు. భగవద్భజన చేయువాడు పాపియని యెట్లు పలుకనగును. కాని అక్కడక్కడ పాపాత్ములుగూడ భజనయందు ప్రవృత్తి గలిగి యుండుటయు కనబడుచున్నారు.

ఇట్టిది సూరదాసునికివలె భగవత్కృపచేతనే గలుగు చున్నది. పాపియగువాడు భజనయందు లీనముగాడను నియ మము లేదు. మరియు నీ విషయములో నేనొక ఘటనమును స్వయముగ జూచితిని. ఒకసారి తారకేశ్వరమునందు ఒకగొప్ప ధనికుడు వచ్చెను. అతడు మిక్కిలి దుర్వ్యసనము గలవాడు. ఒక దినము నతడు మద్యపానము చేయుచుండెను.ఆసమయము లోనే ఆమార్గమున నొక మహాత్ముడు వెళ్లుచుండెను. ఆ త్రాగుబోతు ఆమహాత్ముని బిలిచి రా ఒకలొట్టెడు త్రాగుడు. అనెను. అప్పు డామహాత్ముడు అరే నీకు పాయ్యేకాలము కొద్దిలోనే యున్నట్లున్నది. ఇంక నీదుర్వ్యసనము నీకు తృప్తి కాలేదా? యనెను. ఈమాత్ర మని మహాత్ముడు వెడలి పోయెను. కాని అప్పటినుండి వానిచిత్తము మారమొద లిడెను. సారాయి జాడీలన్ని బద్దలు గొట్టెను. అంత నత డింటికి తిరిగివచ్చి భజనలో మునిగిపోయి పదునైదుదినము లకు తినుబండారములను బెట్టుకొని యింటిలోపల తలుపు వేసుకొని భజనలో నుండెను. కొలదిరోజులకు ఆయన ధర్మ పత్నిగూడ అట్లే భజనయందు లగ్నమాయెను. ఈవిధముగ వారు తరించిరి.

# శ్రీ అన్నపూర్ణాష్టక స్తోత్రమ్

నిత్యానందకరీ వరాభయకరీ సౌందర్య రత్నాకరీ
నిర్ధూతాఖిల ఘోరపావనకరీ ప్రత్యక్షమాహేశ్వరీ ।
ప్రాలేయాచల వంశపావనకరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ ॥ 1 ॥

నానారత్న విచిత్ర భూషణకరీ హేమాంబరాడంబరీ
ముక్తాహార విలంబమాన విలసద్వక్షోజ కుంభాంతరీ ।
కాశ్మీరాగురు వాసితారుచికరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ ॥ 2 ॥

యోగానందకరీ రిపుక్షయకరీ ధర్మార్థ నిష్ఠాకరీ
చంద్రార్కానల భాసమానలహరీ త్రైలోక్య రక్షాకరీ ।
సర్వైశ్వర్య సమస్త వాంఛితకరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ ॥ 3 ॥

కైలాసాచల కందరాలయకరీ గౌరీ ఉమా శాంకరీ
కౌమారీ నిగమార్థ గోచరకరీ ఓంకార బీజాక్షరీ ।
మోక్షద్వారకవాటపాటనకరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ ॥ 4 ॥

దృశ్యాదృశ్య ప్రభూతవాహనకరీ బ్రహ్మాండభాండోదరీ
లీలానాటక సూత్రభేదనకరీ విజ్ఞానదీపాంకురీ ।
శ్రీ విశ్వేశమనఃప్రసాదనకరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ ॥ 5 ॥

ఉర్వీ సర్వజనేశ్వరీ భగవతీ మాతా కృపాసాగరీ
వేణీ నీలసమానకుంతలధరీ నిత్యాన్నదానేశ్వరీ ।
సర్వానందకరీ సదా శుభకరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ ॥ 6 ॥

ఆదిక్షాంతసమ స్తవర్ణనకరీ శంభో స్త్రిభావాకరీ
కాశ్మీరా త్రిజలేశ్వరీ త్రిలహరీ నిత్యాంకురాశర్వరీ ।
స్వర్గద్వార కవాటపాటనకరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ ॥ 7 ॥

దేవీ సర్వవిచిత్ర రత్నరచితా దాక్షాయణీ సుందరీ
వామా స్వాదుపయోధరప్రియకరీ సౌభాగ్య మాహేశ్వరీ ।
భక్తాభీష్టకరీ దశాశుభకరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ ॥ 8 ॥

చంద్రార్కానల కోటికోటిసదృశా చంద్రాంశుబింబాధరీ
చంద్రార్కాగ్ని సమానకుంతలహరీ చంద్రార్క వర్ణేశ్వరీ ।
మాలా పుస్తక పాశసాంకుశధరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ ॥ 9 ॥

క్షత్రత్రాణకరీ మహాభయకరీ మాతా కృపాసాగరీ
సాక్షాన్మోక్షకరీ సదా శివకరీ విశ్వేశ్వర శ్రీధరీ ।
దక్షాక్రందకరీ నిరామయకరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ ॥ 10 ॥

అన్నపూర్ణే సదాపూర్ణే శంకరప్రాణవల్లభే ।
జ్ఞానవైరాగ్య సిద్ధ్యర్థం భిక్షాం దేహి చ పార్వతీ ॥ 11 ॥

మాతా చ పార్వతీ దేవీ పితా దేవో మహేశ్వరః ।
బాంధవాః శివభక్తాశ్చ స్వదేశో భువనత్రయమ్ ॥ 12 ॥

ఇతి శ్రీమచ్ఛంకరాచార్య విరచితం అన్నపూర్ణాష్టక స్తోత్రమ్

శ్రీ భజనసమాజము.

# దేవుడనగా ఎవరు?

కొలంబియా బ్రాడ్ కాస్టింగ్ కంపెనీ డైరెక్టరు లండన్ పట్టణమున గాంధీమహాత్ముని దర్శించి, దేవుడనగా యెవరని అడిగిరి.

1. మహాత్ముని జవాబు:- నాచుట్టునున్న ప్రపంచము లోని సర్వ చరాచర వస్తువులు పుట్టుట, లయించుట మున్నగు పరిణామములు జెందుచున్నను, వీనికాధారమై యెట్టి పరిణామమున్ను చెందనట్టి, చైతన్యశక్తియే దేవుడు. ఏలన మృత్యుమధ్యమందు అమరత్వమున్ను, అంధకారమున అంతర్జ్యోతిని. అనంత దుఃఖమధ్యమున ఆనందానుభవమే దేవుడు. ఈ ప్రత్యుత్తరమునకు లక్షరూప్యములను మహాత్మాజీకి ఆ కంపెనీ డైరెక్టరు పారితోషికముగ సమర్పించి కృతకృత్యుడనైతినని విన్నవించెను. ఆత్మకథ. గాంధిజీ:- భగవంతునియందు నాకు పూర్ణవిశ్వాసము కలదు నాజీవితములోని అనేక కష్ట సమయములయందు దేవుడు నన్ను రక్షించెను. భోజనము చేయుట, నీరు త్రాగుట, కూర్చుండుట మొదలగునవి మన కెట్లు నిజమో అట్లే పూజ ప్రార్థన ధ్యానము కూడా సత్యము. ఇది అంధ విశ్వాసముకాదు. సంపూర్ణమైన సత్యము. స్వానుభవము అదియే దేవుడు!

2. శ్రీ రామకృష్ణపరమహంస:- ఒకటి దేవుడు. సున్న జీవుడు. సున్నకు విలువ సంఖ్యవున్నప్పుడే. లేనిచో దానికి విలువేది? అలల కాధారము సముద్ర మెటులనో, ఈ సగుణ ప్రపంచమున కాధారమైన అనంత చిదాకాశరూపుడే దేవుడు!

3. శ్రీ వివేకానందస్వామిజీ:- లోకసేవకై ఈదేహమును నాహుతి యొనర్పుడు. తీవ్ర తపస్సుచేసి నేను గ్రహించిన మహత్తర సత్యమిది. దృశ్యమానమగు ఈ సమస్త జీవ కోటియు దైవస్వరూపమే! అస్తి, అస్తియను సద్భావమును ప్రకటింపుడు. ఆస్తిక్యభావమును వృద్ధి జేసుకొనుడు. నాస్తి, నాస్తియను వ్యతిరేక భావములను వదలుడు. ప్రతిజీవియందును అనంత దైవశక్తి కలదు. తన పురుషప్రయత్నమువలననే తనుద్ధరించుకొనవలయును. తన్ను తానుద్ధరించుకొను పురుష ప్రయత్నమే దేవుడు!

4. శ్రీ స్వామి రామతీర్థ :- దేవుని భక్తియనగా బిచ్చమెత్తుట, యేడ్చుట, తల బాదుకొనుట కాదు. అనిర్వచనీయమగు సమత్వదృష్టి సర్వస్వరూపియగు దేవుని అన్నిటిలో దర్శించుటయే ఈ విశ్వమంతయు దేవుని స్వరూపమేననియు, అదియే తన స్వరూపమనియు, తెలుసుకొనుటయే దేవుడు!

5. శ్రీ రమణభగవాన్:- తాను విశ్వము. దైవము వేరు కాదు. ఒకటే! తన్నెరుంగుటయే దేవునెరుంగుట అదియే దేవుడు!

6. శ్రీ అరవిందులు:- తాను విశ్వరూప భగవానుని ప్రేమించి, వారికి తన్నర్పించుకొనుచో, తనకు విశ్వరూపమునే భగవానుడు ప్రసాదించును. సముద్రమునకు తన్నర్పించుకొన్న ఉప్పుకణువు సముద్రమే తానగుచున్నది కదా.

7. శ్రీమహర్షి మలయాళ స్వామివారు:- అజ్ఞానదృష్టి, జ్ఞానదృష్టి, విజ్ఞానదృష్టి అని దృష్టులు మూడు విధములు

కులమును మాత్రమే చూచుట అజ్ఞానదృష్టి. సర్వులలోని గుణములను పరికించుట జ్ఞానదృష్టి. ఈవిశ్వమంతయు భగవత్ స్వరూపముగ చూచుట విజ్ఞానదృష్టి అట్టి విజ్ఞాన దృష్టియే దేవుడు!

8. దైవాత్మ స్వరూపులగు మహాజనులారా! ప్రపంచములో సత్యాసక్తులగు ఉత్తమ పురుషులు మిక్కిలి కొలదియే యున్నారు. వారి శక్తివలననే ఈ ప్రపంచము నిలచియున్నది. అట్టివారు కొలదిమంది యైనను వారిశక్తి అద్భుతమైనది, అట్టి వారిశక్తి దైవశక్తిలో అంతర్భాగమే! అట్టి శక్తియే దేవుడు!

పెనములూరు శ్రీ పరమాత్మానందాశ్రమము. తను, మన, ధనములను దైవ సేవకై సర్వార్పణము చేసిన శ్రీ సాధు వెంకటేశ్వరస్వామిజీ జ్ఞాపకార్థము.

ఇట్లు భవత్ సేవాభిలాషి

భజనబాబు

# శ్రీ భగవన్నామ సంకీర్తన పుస్తకమునకు ధర్మముగా యిచ్చిన చందాలు.

ప్రతి పేరునకు మొదట 'శ్రీ' యనియు, చివర "గారు" అనియు చేర్చి చదువుకొన ప్రార్థన.

| | |
|---|---|
| పెద్ది పుల్లమ్మ | రు. 25-0-0 |
| ప్రెసిడెంటు:- లంకా సూర్యనారాయణ | 20-0-0 |
| పుర్రా రాఘవయ్య | 20-0-0 |
| బండ్లమూడి బ్రహ్మయ్య | 10-0-0 |
| పుచ్చకాయల శేషయ్యగారి భార్య బుల్లెమ్మ | 10-0-0 |
| చెరుకూరిఅంకప్పగారి భార్య సౌభాగ్యమ్మ | 10-0-0 |
| పెద్ది తాతయ్యగారి భార్య గాలెమ్మ | 10-0-0 |
| చిగురుపాటి వెంకట్రామయ్య | 10-0-0 |
| చెరుకూరి నాగేంద్రము | 5-0-0 |
| పెద్ది సాంబయ్య | 5-0-0 |
| పత్తిపాటి సత్తెము | 5-0-0 |
| యాదిగిరి కోటయ్య | 5-0-0 |
| పట్టయ్యగారి హాలక్ష్మమ్మ | 5-0-0 |
| పెద్ది పోతురాజుగారి భార్య సౌభాగ్యమ్మ | 5-0-0 |
| పెద్ది క్రిష్టయ్య | 5-0-0 |
| చిగురుపాటి నాయుడమ్మ | 4-0-0 |
| మాదిరాజు వెంకటప్పయ్య | 4-0-0 |
| చెరుకూరి అయ్యన్న | 4-0-0 |
| పెద్ది రంగారావు | 2-0-0 |
| రావిపాటి సీతారామయ్య | 5-0-0 |
| బండ్లమూడి పున్నయ్య | 5-0-0 |
| చెరుకూరి నాగేశ్వరరావు | 2-0-0 |
| పెద్ది జానయ్య | 2-0-0 |
| నాగండ్ల నాగభూషణం | 2-0-0 |
| చెరుకూరి అంజయ్య | 2-0-0 |
| పెద్ది సుబ్బయ్య | 2-0-0 |
| బండ్లమూడి సత్యం | 2-0-0 |
| చెరుకూరి వీరయ్య | 1-0-0 |
| చిగురుపాటి సాంబయ్య | 1-0-0 |
| పెద్ది పున్నయ్య | 1-0-0 |
| గోరవిశేటు వీరభద్రయ్య | 1-0-0 |
| పిన్నమనేని వెంకటేశ్వర్లు | 1-0-0 |
| చెరుకూరి నాగభూషణం | 1-0-0 |
| గోంది నరసింహారావు | 1-0-0 |
| చెరుకూరి రాధాకృష్ణయ్య | 1-0-0 |
| పెద్ది సీతారామయ్య | 2-0-0 |
| రవణయ్యగారి సుబ్బయ్య | 2-0-0 |
| మంచికలపూడి నాగయ్య | 2-0-0 |
| చెరుకూరి జనార్దనరావు | 2-0-0 |

తోటకూర తిరుపతిరాయుడుగారి భార్యా లక్ష్మమ్మగారు,
పోరంకి రు. 5-0-0

డిటో గ్రామం తోటకూర శివరామకృష్ణయ్యగారి ధర్మపత్ని
మహిమ్మగారు రు. 5-0-0

